సీ. దుర్దినకాలంబు దురితపూర్ణంబైన దక్షిణాయనమని తలఁకవయ్యొ
నైదాఱుదివసంబు లాకాంతిలేకున్న, వస్తుజాలంబులు వాలిపోవు
నగ్ని దేవుఁడుగూడ వాకాంతిలోవాఁడె, యాటచేహెచ్చక యణఁగి యుండు
నుదయింపకుండిన నదితపృకుండంగఁ, బ్రళయకాలమిఁక సర్వంబుసున్న
గీ. అహహ! యింక నెన్నో మాట లనఁగనేల? సకలకర్తయై ప్రత్యక్షనరసదైవ
మైనసూర్యు సేవించిన నన్ని కోరుక, లబ్బు మోక్షమబ్బును సందియంబు లేదు. 23

క. పరమహిమ ఘనతనుబ్రితా, పరమనణఁచు కాళ్యపీను భాతిగను సదా
పరమహిమ ఘనతనుఁబ్రతా, పరమనణఁచు కాళ్యపీను భావింతుహరీ. 24

మ. అరిమందేహవధంబు దుష్టహరణం, బంచూహఁ జేయంగ లే
కరుణుండింద్రుడవ లెన్ని మాత్సజయముండందు విన్నుందూఱుదుం
ద్రరుణుఁ సారథిఁజేసి సర్వములఁ ద్రాళ్లైక్యంబ్వఁ గైకొన్నసీ
పరమౌదార్యమెఱుంగ రజ్ఞులఖిల ప్రత్యక్షదేవోత్తమా. 25

చ. కనెనిమవల్లఁ బాండునతి కర్ణునినన్న చరిత్రవొంగక
ల్పనయని చిత్తదుర్బలులు, పల్కుదు రెంతురు, నీదుగాధ దాఁ
కనుబరువెత్తుటేల? చిరకాలమునుండి నిజాలయంబెయా
ఘనమహిదేవిరూపమును, గన్గొనిరే? యెవుడైన భాసకరా. 26

మ. హనుమంతుండు భవత్సమీపమున విద్యల్ నేర్పినాఁడన్న పా
వనచారిత్ర మసత్యముంచుమిగులన్, వాదింతురజ్ఞానులా
యనఘాత్ముండె సమీరదేవతనయుం, డన్నప్పుడేసట్టి దు
ష్మనమిద్దానికి నేల? కల్గవలెనో! మాన్యార్య: సూర్యప్రభూ. 27

క. నీమండలమేనీవని, నీ మేను జడమను చంద్రుడు నీచులు, తుదవా
రేమేను ధరించియున, గ్రామమునకుఁ బోదురల్ల క్రమమెఱుఁగరవీ. 28

చ. అనువగు చేతిరాత్తుగల దైవతురశ్రితఁ జిత్రనైజముం
గనిన శరీరముల్, మధువు కైవడి భాసిలు పింగళాక్షులుం
దనరఁగఁ జిన్నిజుట్టుముడి, దాల్చిననిన్నురుదివ్యదృష్టిచేఁ
గనిమును జెల్లఁ జెప్పనది, కల్లమమూఢుఁడ; సూక్ష్మభారవీ. 29

క. శ్రీమదోగ్యగమునీంద్రుఁడు, నీమండలమందునందుని నార్చెదిమనో
వ్యోమమునందే పొందున, శ్రీమాహాత్మ్యమున నీశరీరమెపొందుల్. 30

మ. తనకంటెన్నను మున్ను దక్షుసభలోఁ, దన్నించి తద్బాధచే
జనకద్రోహిని వీరభద్రునిఁ బిశాచవ్రాత సేనానిరై
మునఁగాఁ గాటికి వెళ్ళఁగొట్టినను బ్రేమంబాలచే శరస్కగం
జానిచెన్ శంభుఁడు; కోపమీశునయినం, బీడించు సూర్యప్రభూ. 31

మ. రతివేళన్ శశినీ ప్రభాహతరుచిన్, రాణింపమిన్ భార్య ను
స్మితవక్త్రాబ్జము చూలి రెండుకనులం, బ్రేక్షించు; నింకెప్పుడున్
సతివామాంగమునందె చేర్పు; నదియుష్మత్తీక్ష్ణతన్ శీతప
ర్వతపుత్రీసుమనోంగభంగము గునన్ భ్రాంతిన్ గదా! భాస్కరా. 32

మ. నిజకాంతాననినీరజంబుగతకాంతిన్ మొగ్గగా కుండనా
యజుఁడాత్మన్నియమించి మించినను గాయత్రీమహామంత్రరా
జజపంబూనియజించుఁ; గాలగతి యుష్మన్మూర్తి యస్త్రాద్రికే
గజగంజేసమయించి యందెనిదురం గాంచుంగదా? శ్రీహరీ. 33

శా. సత్రాజిత్తు శమంతకోత్తమమణీసద్భాగ్యమందెన్ సదా
శ్వేత్రోకసహస్రమయూరుఁ డజ్ఞకవిరాడ్వీరత్వముల్గాంచె, స
ద్ధాత్రీదేవతలద్భుతాత్మమహిమన్ ధన్యత్వముంగండ్రు, భ
క్తత్రాణంబున మీఱు నీ కరుణచేఁ గాదా? గదారీ! హరీ. 34

మ. కమలంబందు జనించె బ్రహ్మ; హరికిం గన్నుల్ సరోజాతముల్
కమలావాణులు పద్మవాసిను, లుమాంగంగాధరాద్యామరుల్
కమలాబ్జాతులదాను, లాకమలినీకాంతత్వకీర్తిన్ బుధో
త్తమనామంబును బొందియుంట సకలాద్యస్వామి వీవేరవీ. 35

మ. అవనిన్మానవజన్మమున్నట ఘనంబౌ, దానఁబుంస్త్వంబెయౌ
కుఱవయా, విప్రత దానగావృదగుఁ గోరుఱల్ గూర్చు మంత్రాళియ
య్యవనీదేవతమేను, తజ్జననిగాయత్రీ మహాదేవి, త
ద్భవమూలోత్తమమూర్తివౌట సకలాద్యస్వామి వీవేరవీ. 36

మ. అతిథీశున్ భయపెట్టు ఛాయ నిజజాయం బంచపాల్ సేసి, త
త్సుకులాకాలుంతో నిరంతము శత్రుత్వంబు పాటించి, సం
స్తుతసౌఖ్యప్రద లోకబాంధవతతో, శోభిల్లు నీయందు భా
సితమాతృత్వి పరోపకారమెగదా? శ్రీసూర్యనారాయణా. 37

మ. తనచెక్కిళ్ళను జక్రిచెక్కిళ్ళనవగం దత్పుత్రు వాలిన్ హరిన్
వను, నీయొద్దని విద్దెబుద్ధిఁ గొనుటం దత్పుత్రు సుగ్రీవుఁ బెం
పను దోడ్తైన మరుత్సుతుంపు తనునిన్, భావింపుదున్ స్వర్గమం
దున నహ్యంపడునన్నుఁ జేమఁ గనఁ జే? దూరీకృతారీ! హరీ!!. 38
ఉ. నిత్యము సత్ప్రతావమున, నీవలెనీకడనున్న శూరులై
సత్యముగా హిమాద్రితనుజాతసుశక్తిగఁ బూర్ణగాఢసాం
గత్యముచేతఁ జేసెను శిఖామయరుగ్మలటన్న నీయధి
ప్రత్యధిదేవతల్ తరణి! పాపుతమా మక జాడ్యజాలముల్. 39
మ. అనిలుండుద్భవమందఁ బ్రాణుల శరీరాంతస్థ దుర్వాయువుల్
దరమై బైటికివచ్చు; నవ్వుడును నిద్రం బొందినన్ నీదు భీ
కరతన్ లోనికె పోయి యభ్యుదితురోగం బెచ్చుగా నిచ్చు నా
సరణింబోయెడి వేళ నాకొసఁగవే! సౌఖ్యంబు సూర్యప్రభూ. 40
మ. అభినిర్ముక్తతయందు నభ్యుదిత కార్యంబందు నప్పాజ్ఞతా
త్యభిమానాబలతాదిదుర్గుణము లత్యంతాశ నెత్తెక్కుటన్
శుభదార్ఢ్యంబు నిరోగముంగొనుటకున్, శుద్ధుండఁ గాకుంట ఘో
రభయభ్రాంతిఁ జింతనొందునను సంరక్షింపుమా! మిత్రుఁడా. 41
శా. నాపూర్వార్జిత పాపకర్మగతినో నానాల్పభావక్రియా
రూపంబైన కవిస్వభావముననో క్రూరస్వభావుండనై
యేపుణ్యక్రియ నైనఁ జేయుటకు నొక్కింతైన శ్రద్ధంగొనన్
నీపేరుల్ వచియించుచుం గొలిచెదన్, నన్ గావుమా! మిత్రుఁడా. 42
క. నీవారముని సిరుధరధు, నీవారము నీరము గొను నిష్ఠకుఁ దృప్తిన్
నీవారము క్షేవళమగు, నీవారము నాఁగ సుఖము నిచ్చునె? మిత్రా. 43
క. కరమనుజతనిశుముదివా, కర! పరతిమిరనికరదరకర! సరససుఖా
త్కరకరకర! వరకరుణా, కర! యనివారకరతికగకరపుటమిదిగో. 44
చ. ఎదురెటుగన్నలేక చనునే: బదితొమ్మిది వేల యేఁబదే
న్మిదిదశలం గ్రహాళి గమించుచు నుద్భవకాలరాసులం
దెదిగను, జెవ్వరింగలసి, యేఫలకారతః, నేయవస్థ, నే
వదమున నున్న, గోచరభవద్స్థితి భద్రమె యిమ్ము భాస్కరా. 45

సీ. ఆరోగ్య, యజ్ఞ, రాజ్య, సుఖ, బలాదులు, కనకాశ్వవాహన గమనసిద్ధి
సింహాసనస్థితి, శ్రీపద్మరాగముల్, తామ్రలోహము, తృణధాన్యరాశి,
రక్తశాలువులును, రంజిల్లుఛత్రముల్ శౌర్యంబు, నౌషధసంగ్రహమ్ము
నగ్నిజయస్తంభనాది ప్రభావముల్ నేత్రవైద్యత ముక్తినియతబుద్ధి
గీ. నీవొసంగుఫలములెగాన నిత్యముంగ, గాత్రమున్నంతవఱకు నత్కరుణనిచ్చి
వ్యాధిమృత్యుజరాభవ వ్యథలు లేని, ముక్తినిమ్మటుపైనసత్పూజ్యమతి, 46
మ. మతిలేకేవియొ కోరుచుందునవి యీయామై యొండుపర్యంత మే
పితవా నీవరుదెంచి నేరములకుం బీడింతు వంచులుఱనన్
గతభీనాడుకొనంగ నీవెపుడుగానన్ రానిచోటైన శా
శ్వతమోక్షస్థితి నుంచుమీ భవముపైఁ బాపాపహారీ; హరీ! 47
సీ. తనపేరమానీకుఁ దగనెలికిమ్మీరుఁడానిఁ బితృసమానుఁడయ్యె మాకు
నతనిసెచ్చెలిచుట్టమగు హిడింబుఁడుగూడ నతనితోనె సమానుఁడయ్యె మాకు
నతనిచెల్లెలిమగండనిలోనబలుమగండైన భీముఁడు మామయయ్యె మాకు
నతనిమామకుమారుఁ డఖిలజగత్పితయైన కృష్ణుఁడుఁ దండ్రియయ్యె మాకు
గీ. నతనికుడికన్నుగానీవె యమరియుండ, నీకటాక్షము మాయందు నిల్పుమంచు
వేఁడవలెనే? సుతులఁ బ్రేమఁజూడకున్నఁ, దండ్రికపకీర్తిరాదటే? తరణిదేవ.
ఉ. శ్రీయుతముత్యవెంకయకు రెండవపుత్త్రుఁడు, ముత్యసూర్యనా
రాయణమూర్తి, సీతనగరాబుధదత్తకుమారుఁ డాదినా
రాయణమూర్తిసేవన వరాయణ కిర్లమపూఁడివాసి, పా
రాయణబుద్ధిలోకము పరాయనఁ జేసెనిటుల్ రవిస్తుతిన్. 49
క. దీనిఁ జదివిన వ్రాసినఁ, బూనికఁ జదివించి విన్నఁ బూజించిన దే
హానూన మనోబలములఁ, బూని సుఖముగాంతురు జనములు మిత్త్రదయన్. 50

49.

# చంద్రస్తవము.

శా. శ్రీమద్భాస్కర మండలానలదిశా శ్రీచంద్రమోమంటపో
ద్దామత్ర్యాట్చతురశ్రపీఠమునఁ బ్రత్యగ్దిఙ్ముఖాసీనుఁడై
హేమాభాంగద వజ్రకుండల కిరీటోద్ధాంగుఁడై సద్గదా
శ్రీమత్పాణి దశాశ్వదివ్యరథుఁడౌ శీతాంశు భావించెదన్. 1

క. శ్వేతాంబరు, శ్వేతాశ్వుని, శ్వేతధ్వజచామరాద్యు శ్వేతచ్ఛత్రున్
శ్వేతస్రక్చందనధరు, శ్వేతాంశుని, శీతశీలు శ్రీమతిఁదలఁతున్. 2

క. తనతేజున రవిజగములు, జనియింపఁజేయుఁదనదు చల్లనిబలుతే
జునజైవాతృకతనిడుచు, మనఁజేసెదునమృతమూర్తి మదిభావింతున్. 3

మ. వరమోంకారమనోబ్ధిఁబుట్టి జగముల్ పాలింపఖేచారుఁడై
సరసాత్రేయసగోత్రజాతుఁడయి వంశస్థాపనాచార్యుఁడై
వరదుగ్ధాబ్ధిజనించి యీశ్వరశిరోభాగాద్యలంకారుఁడై
స్థిరకీర్తిన్విలసిల్లు తెల్లదొరకుంజెల్లింతు సల్లాపముల్. 4

క. తనుకారకతఁగనుటం, దనుజవ్యాధులనడంప నతిఁజేసితి సూ
ర్యునికి; మనఃకారకునిను, మనోభవాధులనడంప మదిఁదలఁతుశశీ. 5

మ. ప్రజజన్మించినవేళఁ బూర్ణత మనోభావంబునందుండి యా
ప్రజకుంజిత్తబలంబుఁ బెంచుటఁ "బరబ్రహ్మంబు చిత్తంబులో
నజనించెన్ శశి" యందుశాస్త్రరిపులు న్మన్నింప జ్యోతిష్క్రమా
నిజనానందముఁగూర్చు బ్రాహ్మణవిభున్ నిన్నుందలంతున్ శశీ. 6

క. ఘనబుధులందఱు నీమే, నినుకళలుగాఁగఁజెకిలి నీరక్తముదాఁ
వినవారికి మిత్రుఁడవై, తనరెడునీసౌమ్యమహిమఁ దలఁతున్ సోమా. 7

క. సురభుక్తనిజతనువిలా, సురులధ్వరములను మఱల సుగుచింబరఁగన్
విరచించుటఁ దద్భూసుర, వరదైవతమువయిన నినుభావింతుశశీ. 8

మ. కటకింజీఁకటిలోనఁ దన్నునతలోకంబుల్ "పిశాచంపిదె
చ్చటి"దంచున్ నిశలందుఁగొల్వరని చర్చల్ సేయు శ్రీనిష్ఠతో
"నిటుబావా! వగనొందుటేఁగలుగఁగానే" యంచుఁ బూర్ణప్రభా
పటలిన్ సర్వవిచారముల్ దొలఁచునిన్ భావింతుఁ జంద్రప్రభూ. 9

క. నినుజగమబ్జుఁడనటం, గనకజ్ఞుఁడు నీదుజన్మగారము దుగ్ధాం
బునిధియులమీఁద లేదని, యనఘపురాణములఁదూలనాడు సుధాంశా. 10

చ. ఘనకృశమై, సువృత్తమయి, గాఢకఫానిల మిశ్రతత్వమౌ
తనువును, మంజువాణియును, దట్టపుటూహలు పన్నుబుద్ధియుం
దనరశుభప్రదాక్షులను దాల్చిననిన్నురుదివ్యదృష్టిచేఁ
గనిమునులెల్లఁజెప్పనది కల్లను మూఢుఁడు సూత్రభాంబుజా. 11

గీ. దక్షుశాపంబున భవత్క్షయాభి, వృద్ధులగునన్న; భూచ్ఛాయఁ జెరఁగితగ్గ
నీదుమండలస్థితినిట్లనిరని యొకఁడు "మునులుమూఢు"లను నిదేమిబుద్ధి? చంద్ర.

సీ. రవికాంతినోషధుల్ బ్రతికింపఁ; జల్లని నీకాంతిసారంబు నింతువందు
రవియగ్నిరూపధరా భవదోషముహరింపఁ, జల్లఁగాఘుటికల నల్పుదీవు
రవ్యుష్ణఘుటికగర్భముఁజేరఁ; జల్లనియనుపానమై నీవు నరుగుదటకు
రవియుష్ణవృద్ధిచే రంజింపఁ; జల్లనిపథ్యంబులను నీవు బలముగూర్తు
గీ. వహావా! కోరనిబుధవైద్యులైనసూర్య; నిన్ను నమ్మినరోగముల్ నీఱుగావె?
చావుచావదే? తెలియకజడుఁడుమూఢ, వైద్యులనునమ్ము; శతభిషక్ప్రభుసుధాంశ

సీ. ఇట్టిపిల్లయటంద్రు మట్టిచెట్టందురు తొట్టిగుండెయటంద్రు తోఁచినట్లు
వీరభద్రునితన్ను వేఁడిమచ్చయటంద్రు తారకోరస్స్న కస్తూరియంద్రు
భర్గజటాచ్ఛటా ప్రతిబింబమందురు నల్లచెవులపిల్లి పిల్లయందురి
కవులిట్టులనయంత్ర ఘనసాధములు భవన్మండలస్థాదిగణంబులంద్రు
గీ. బళిర! నీమచ్చబలుపిచ్చి తలఁపులిచ్చె, నమృతపూర్ణయుష్మన్మండలాంతరస్థ
రుచిరరోహిణకద్విపరూపమనియె, జ్ఞాననేత్రవేదవ్యాసమౌని; చంద్ర. 14

మ. పరమశ్శాంతిగురుండు నిన్ను శపియింపన్మాని నంగుండుటన్
గురుపత్నీకుచశాతశూలహతినీకుం గుండెపుండై నిజ
స్థిరదివ్యామృతశక్తిమానియును దుష్కీర్తింగడుం దొట్టియై
పరఁగన్ మచ్చగనందురి; ప్రౌఢకవి నెవ్వాఁడావుఁ? దారాధిపా. 15

క. కవిగౌతమాదులవలెనె, సువచశ్శరుఁడయ్యెగురుఁడు "సోమఃప్రథమో
వివిదే"యను శ్రుతిఁగనిద్విజ, ధవు నిన్ను శపింపకుండెఁ దారాజారా. 16

సీ. గురుసతిం దారేచ్ఛ గురునకర్పింపక, నతనితోబలుకయ్యమాడునీకు
బ్రహ్మదావచ్చిపూర్వమ్ము నీవుతనకు, నిచ్చినరోహిణినిచ్చి మఱల
"దీనినిందారాధికానూనరుచిఁగొను", మనినిజాంశజుని నిన్నునయించి
గురునకుఁ దారానుగుణ్య సౌఖ్యమునిచ్చి, యాబ్రహ్మతనయింటి కరిగినంత
గీ. నెంతదారేచ్ఛతో దాని నేలుకొన్న, రోహిణీపతినామంబు రూఢిగాక
నీకుఁదారాధిపత్యాఖ్య నిల్చెఁజందురి!, యిలను దారేశగురుమూర్తి వీవెకావె?

క. గురుఁడవయిన కారణమున, గురుతరశుభమొందఁగోరి గురుభక్తిని నా
గురుగతిని నుతింతును నలు, గురు పెద్దలతోఁ బ్రవను బుధగురునిఁజందారి. 18

మ. శివుఁడుగా త్రిక్ష్మఁ దురదుర్గుఁడాతనికడన్ శ్రీశక్తితోనోర్చి ని
ల్వ, వరాత్మ శ్రితకోటిఁ జల్లనిదయం బాలింపనౌనందు శీ
తవరాద్రీశుఁడు శ్రీవతంసమయి, నేత్రంబై, ముఖంబైతగన్
శివకన్నన్ను నిజాంశుఁబన్నుపఱచెన్ శ్రీచంద్రిలోకేశ్వరా. 19

క. ఘనముగ నిహపరసుఖములు, గనఁగ్రిమముగ ధీమనములు కారణములుగా
వునఁ దత్కారకుఁడవగుట, ననిశంబు నొసంగుమనఘ మునసవిచంద్రా. 20

ఉ. నిత్యము శీతలాత్మతను నీవలెనీకడనున్న తల్లులై
సత్యముగా జగత్ప్రసను శంకరతాపములెల్ల గాఢసాం
గత్యముచేతఁ బాపు శివగంగయు గౌరియు నన్న నీయధి
ప్రత్యధిదేవతల్ జలజ! పాపుత! మామకతాపపాపముల్. 21

క. తాపత్రియరూపకసం, తాపము: బాపములుఁ బాపి తావనభూపుల్
రేపును మాపును నోపికఁ, జేపడఁజేసికొను మనమృత సీమునిమశశీ.

మ. తతహాలాహల ఘోర హేతివిషమంతర్బాహ్యలోకాళిసం
తతిఁ బోవంగ శమం బిముడ్చుకొని తత్తాపపహార్థమై
సతతాచ్ఛామృతమూర్తి నిన్నుఁదలపై సంప్రీతితోఁ దాలిచెన్
శితికంఠుండు; మనుష్యతాపముని నన్ నీకొక్కలెక్కా? శశీ. 23

చ. ఎదురెటుగన్న లేకచను నేఁబదిలొమ్మిదివేల యోఁబదె
న్మిది దళలం గ్రహాళిగమనిం దుముదుద్భవ కాలరాసులం
దెదిగను, చెవ్వ్రింగలసి, రయేఫలకారత, నేయవస్థ, నే
పదమున నున్న, గోచరభపక్షిస్రితి భద్రిమెయిమ్ము! చంద్రుఁడా. 24

క. శారదనీరదనారద, పారదహారదరహీర భాసురమూర్తీ
పారసభవ, సారసభవ, పారసభవ నాభక్తి సతతమునిమ్మా. 25

సీ. చిత్రవప్రపాద, సుస్త్రీ, విత్త, గోక్షీర, జల, వస్త్ర, కృషి, సస్య, సత్ఫలములు
మణులు, శంఖములు, చామరములు, పాండురచ్ఛత్రముల్, సౌరభసారసములు
వీర్యపుష్టి, వినయ, వ్రీడాభరోరుకేదారలాభమ్ము, దీప్తతత్వగరిమ,
ఫలవర్గ, రసవర్గ, బహుభాగ్య భోగముల్, సంతతానందద సంపదలును
గీ. నీవొసఁగుఫలములెగాన నిత్యములుగ, గాత్రమున్నంతవఱకు సత్కరుణనిచ్చి
వ్యాధిమృత్యుజరాభవ, వ్యథలు లేని, ముక్తినిమ్మటుపైన సత్పూజ్య! చంద్ర.

మ. తనువుల్ సార్థముఁ జేయ వాంఛగొనఁగం, దారాళి దారాళిఁ జే
సినభాస్వద్విరుదమ్మువాఁడవు నను౯ శ్రేయోర్థ శ్రేయోర్థుఁ జే
సినఁ జేయంగలజాణ వంచు నిను వాంఛింప న్మాదల్గాంటి నా
తనువున్ నీవిరుదమ్ము సార్థతను బొందం జేయుమా! చంద్రుఁడా. 27

సీ. ఏన్గురాపిడికోడి యెత్తించి వేఁడిన శశము రొమ్మునఁ జేర్చి సాఁకినావు
విషతాపమును బాప విడిచి సంసారంబు శివశిరోవాసంబు సేసినావు
మృగశీర్షనెవరించి మేలనం దారాళి బుధవరులకు దార నోసినావు
బుధులయాఁకలిదీర్పఁ బూర్ణదేహము గోసి పెద్దతెగువఁ బంచిపెట్టినావు

గీ. జగములేల నిల్కడ లేక సంతతంబుఁ; దిరిగి శ్రమపడుచున్నావు దేని నీయ
వాశ్రితులకు! నానకలభావామలఫలకమృతపదవాసము నొసంగు మమృతమూర్తి

ఉ. శ్రీయుత ముత్యవెంకయకు రెండవపుత్రుఁడు, ముత్యసూర్యనా
రాయణమూర్తి, సీతనధరాబుధదత్తకుమారుఁ డాదినా
రాయణమూర్తిసేవన పరాయణ కీర్తమపూఁడివాసి పా
రాయణబుద్ధి లోకము పురాయనఁ జేసెనిటుల్ శశిస్తుతి౯. 29

క. దీనినిఁ జదివిన వ్రాసినఁ, బూనికఁ జదివించి విన్నఁ బూజించిన దే
హానూన మనోబలములఁ, బూనిసుఖము గాంతురు జనములు చంద్రదయ౯. 30

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ.

# అంగారక స్తవము.

---

శా. శ్రీమద్భాస్వర మండలాంతకదిశా శ్రీభూజనుర్మండలో
ద్దామంబైన త్రికోణపీఠమున సద్ధర్మాధిరాడ్దిఙ్ముఖుం
డై మణ్యంగదరత్నకుండలకిరీటాక్మ్రపరిభాభవ్యుఁడై
శ్రీమచ్ఛక్తిగదా త్రిశూలకరుఁడౌ శ్రీభౌము భావించెదన్.

క. రక్తపటు, రక్తదాముని, రక్తచ్ఛత్రాంకు రక్తు రక్తపతాకు౯
రక్తస్రక్చందనధరు, రక్తతనుం దలఁతు సదానురక్తతఁ బ్రోవ౯.

ఉ. మండల మండలేశ్వరఁ, గమండలజత్వము నంది యంబురు
ణ్మండలమండనాక్షిముఖమండితకుండలగండమండలా
ఖండలవైభవంబులనఖండజవాజనువాజిభూజను
ర్మండలచారుఁడై తగు ఖమండలమండను భానుఁ గొల్చెదన్. 3

చ. జననిమహాక్షమాంగ, బుధసన్నుత సత్కరుణాకరుండు భూ
జనపరిరక్షణాగ్రబహుజన్మధరుండగు మాధవుండు నీ
జనకుఁడు; నీవు భక్తఫలసంఘటనాత్ముఁడ విట్టిపుణ్యసం
జనను నినుంగుజన్ములుసుజన్ముఁడవందు రెఱుంగకోయనా. 4

చ. తనుతమమధ్యమత్వములనదు దారపు దానము నిత్యయౌవనం
బును, చపలస్వభావమును; బూరితపైత్యశరీరమున్ ధరిం
చిననిను దివ్యదృష్టిఁ గని చెప్పినమౌనులఁ దిట్టి మండలం
బునె నినుఁ గాఁదలంచునతిమూఢుఁడు; సూక్ష్మజగత్ప్రభూసుతా. 5

శా. శ్రీపుణ్యంబున భాంగముంగొనియు సుశ్రీమాతృభూపేరిమనో
మాపుణ్యంబువనో సమీపమున ధామంబూని యున్నావు; భా
మా! పూజ్యా! సహజోరుభావనతులన్ మాకిచ్చి మమ్మేలు మీ
యాపాపంబులు లెక్కపెట్టకుము మాయన్నా! స్థిరాత్మోద్భవా. 6

శా. భారంబెల్లనడంచి మమ్మునుసదా పాలింపరావే! జగ
ద్భారోద్వాహక! నేరముల్ సయిఁపవే! ధన్యక్షమాత్మోద్భవా!
భారద్వాజసగోత్రజా! కులగతుల్ పాలింపవే! రాగశో
భారా! నన్ననురాగదృష్టిఁ గనవే! యగ్గింతునిన్నెప్పుడున్. 7

చ. ఎదురెటుగన్న లేక చను నేఁబదితొమ్మిదివేల యోఁబదె
న్మిదిదశలంగ్రహాళి గమనించు మదుద్భవకాల రాసులం
దెదిగను, దెవ్వరింగలసి రేఫలకారత నేయవస్థ, నే
పదమునను న్న, గోచరభవస్థితిభద్రమె యిమ్ము భౌముఁడా. 8

ఉ. నిత్యము శాశ్వతోపకృతి నీవలె నీజననీసుబంధులై
సత్యముగా జగద్గణము సర్వఫలంబులనొందఁ జేసి సాం
గత్యముతోడఁ జేయు మహికాంతయు, క్షేత్రపుఁడన్న నీయధి
ప్రత్యధిదేవతల్ కుజుఁడ! పావక! మామకజీవనవ్యథన్. 9

సీ. సాహస, పరిహరణ సామర్థ్య, భుజబల, జయ, కలహవివాద జయబలములు
యువరాజ భావంబు, సుర్వీజ, మాణిక్య, తామ్ర, ప్రవాళ, కాంతి, కనకములు,
పర్వతమరుదావ భాగనిర్గమనము, వ్యాఘ్రకీటకవిష భయహరణము
దండనీతియును, ముద్రాబంధ, సేనా, శతఘ్ని, సుదుర్గ, పరితాపనములును
గీ. నీవొసంగు ఫలములెగా ననిత్యములుగ, గాత్రమున్నంతవఱకు సత్కరుణనిచ్చి
వ్యాధిమృత్యుజరాభవవ్యథలులేని, ముక్తినిమ్మటుపైన సత్పూజ్య శ్యామ. 10
ఉ. శ్రీయుత ముత్యవెంకయకు రెండవపుత్రుఁడు ముత్యసూర్యనా
రాయణమూర్తి, సీతనధరాబుధ దత్తకువారుఁ డాదినా
రాయణమూర్తిసేవన పరాయణకిర్లమపూఁడివాసి పా
రాయణబుద్ధి లోకమువు రాయనఁ జేసెనిటుల్ కుజస్తుతిన్. 11
క. దీనినిఁ జదివిన వ్రాసినఁ, బూనికఁ జదివించి విన్నఁ బూజించినదే
హానూనమనోబలములఁ, బూనిసుఖముగాంతురు జనములు శ్యామదయన్. 12

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ.

# రాహుంసవము.

శా. శ్రీమద్భాస్కర మండలాశరదిశా శ్రీమత్తమోమండలో
ద్దామశ్యామలశూర్పపీఠమున సద్ధ్యామ్యాన నాసీనుఁడై
హేమాభాంగద నీలకుండలకిరీటేద్ధాంగ నీలాభుఁడై
శ్రీమచ్చర్మగదాసిశూలకరుఁడౌ శ్రీరాహువుం గొల్చెదన్. 1
క. శూలము, గదఁ, జర్మముఁ గర, వాలముఁ దాలిచి కరాళవక్త్రము మెఱయన్
లీలను సింహమునెక్కి జ, గాలను బాలించు సింహికాసుతుఁ గొల్తున్. 2
క. నీలపటు, నీలచామరు, నీలచ్ఛత్రాదిభూషు నీలపతాకున్
నీలకరు రాహువు భువన, పాలుం బైకొననకుల భవు భావింతున్. 3
మ. అలప్రహ్లాదునితండ్రికిం జెలియలేయా సింహికా కాంతకీ
యిలఁ బుత్రుండయి పుట్టి యయ్యమృత పానేద్ధక్రియన్ దేవతా
ఫలముంబొందిత మోక్ష్య మండలమునన్ భానూత్ముఁడై సూర్యచం
ద్రిలసత్క్రాంత్యవరోధ వృత్తిఘనుఁడౌ రాహుం బ్రశంసించెదన్. 4

మ. భవబద్ధాజ్ఞులు దివ్యదృష్టిఁ గొనమిందద్రూపముంగాంచ లే
కవనీచ్ఛాయను నీనివాసముసె నీవంచుఁ వివాదించుచుఁ
భువనప్రాణులకొక్క నీదయిమతుల్ భోగంబులుంగూర్పహే
తువుగాఁజెప్పట కూడదంద్రు; వరసంతోషాశ్రితా! రాహువా. 5
క. నీదయె తాపముఁ బాపును, నీదయె నవ్వై రుధిరముఁ బెంపును మేనన్
నీదయెఘనమై దేహము, బాడుపఱచు నీదయీదె? ఫలములఁ దముఁడా. 6
క. నీనీడసకలరాసుల, పైనంబ్రసరించుచుంట వలనఁ దత్త
త్త్వగుణరీతినిచ్చు ఫ, లానుభవము; చెట్లనీడ యట్లైతముఁడా. 7
ఉ. నీదఫలప్రదంబనిన నీవుఫలంబిడుదన్న శాస్త్రియా
వాఁడు నిరాకరించుటను ప్రాజ్ఞులు మెచ్చిరయేని జన్మకా
లోడుదశానుసారభవదుక్త శుభాశుభజాలమిచ్చు లో
కేడితమైన జ్యోతిషము నెక్కడ? దాఁచుదుమయ్య రాహువా. 8
క. కనుకనెనీడవిఫలదం, బనఁగూడదు; తత్పదార్థ మందలిసూక్ష్మా
త్మనుదగు తేజస్సారమె, యనయము ఫలమిచ్చు; మీకు-న దెగతితముఁడా. 9
మ. అవనిచ్ఛాయను నీవునిల్పుటది యెట్లంచుంజదుండాడు; నా
దివిలో మండలరాశియెట్లునిలిచెం; దేవాంశలింగాత్మయీ
భువనాళిన్ సకలప్రదేశముల నొప్పంగాదె? శ్రీ కామరూ
పవిశేషంబయి; దానిఁజూడఁగలఁడే? పాపాత్ముఁ; డోరాహువా. 10
మ. క్షితిఁగొన్నండ్లు శరీరమూనిపిదపన్ శ్రీ నాథచంద్రామృతా
గతసూక్ష్మాత్మత మోత్మధారివగుచున్ తన్మాచ్ఛాయయా మండల
~~ష్ఠితదృష్టిఁ జదివింపుచు [illegible] హువా.~~ 11
చ. శనిగుణరాశి, ధైర్య, మువనవ్యపుదొంగతనంపుమ్లేచ్ఛవ
ర్తనము ను, బోయరూపు, వనితాజనతాకుటిలస్వభావముల్
గనివిహరించునిన్మహిమ గాంచినమౌనులు దివ్యదృష్టిచేఁ
గనివచియింపమూఢుఁడది కల్లను; నూత్మజగత్ప్ర! రాహువా. 12
మ. ధరణీజాతకజగ్రహంబుదిభర ద్వాజాన్వయంబైనఁ, ద
ద్ధరణీచ్ఛాయవెదైననీదియుభర ద్వాజాన్వయం బేయగున్
వరశైవసగోత్రజుండనియుసుల్ నర్వాభునన్మండల
స్థిరునిన్ బిల్చిరెయుంగలేఁడుజడుఁడీ దివ్యస్థితిన్ రాహువా. 13

ఉ. నిత్యముసర్వముస్మనుప నీలుగఁ జేయఁగ నీదయాదయా
కృత్యనురూపులై భువికిఁ గేవలమాతయై యున్న ధేనువున్
మృత్యువుపేర వచ్చి దిగమ్రింగు పెదమ్మయు నన్న నీయధ
ప్రత్యధిదేవతల్ ననుఁ గృపామతిఁ బ్రోతురు గాత! రాహువా. 14

చ. ఎదురెటుగన్న లేకదను నేఁబదిలొమ్మిదివేల యే బదె
న్మిదిదశలం గ్రహాళిగమునిందు ముమున్భవ కాలరాసులం
దెసగను, చెవ్వరింగలసి, యేఫలకారత, నేయవస్థ, నే
పదమునునున్న గోచరభవత్ప్రతి భద్రిమెయిమ్ము రాహువా. 15

సీ. ఖండన,దండ, ప్రచండ, కాలాహి, తస్కర, రంధ్ర, వల్మీక, కర్తృజయము
భ్రష్టత్వ, సంకోచ, పతన, మహోత్పాత, ఘోర కలహ, బలాత్కార జయము
దేశాటన, మ్లేచ్ఛ, దీనతా,పస్మార, విధవా, జ్వర, విషూచి విధవిజయము
వైరాగ్య, బోధనవ్యవహార సాధన, ధనసౌఖ్య, ధైర్యప్రతాపములును
గీ. నీవొసఁగు ఫలము లెగాన నిత్యములుగ, గాత్రమున్నంతవఱకు సౌఖ్యరుణనిచ్చి
వ్యాధిమృత్యు జరాభవవ్యధలు లేని, ముక్తినిమ్మటుపైన సత్పూజ్యతముఁడ.

ఉ. శ్రీయుత ముత్యవెంకయకు రెండవపుత్రుఁడు ముత్యసూర్యనా
రాయణమూర్తి, సీతనధరాబుధదత్తకుమారుఁడావి నా
రాయణమూర్తిసేవన పరాయణ కీర్తిమహాడివాసి పా
రాయణబుద్ధి లోకమువు రాయవఁ జేసెనిటుల్ తమస్సుతిన్. 17

క. దీనినిఁ జదివినవారిసినఁ, బూనికఁ జదివించివిన్నఁ బూజించిన దే
హానూన మనోబలములఁ, బూనిసుఖముగాంతురు జనములు రాహుదయన్. 18

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ.

# బృహస్పతిస్తవము.

శా. శ్రీమద్భాస్కర మండలోత్తరదిశా శ్రీమద్బృహన్మండలో
ద్దామోదజ్జ్వలముఖమొప్పఁగోణచతుష్టయద్దీర్ఘ పీఠస్థుఁడై
హేమాభాంగదగాత్రకుండల కిరీటోద్ధాక్షమాలాకృతి
శ్రీమద్దండ కమండలూరుకరుఁడౌ శ్రీజీవుభావించెదన్.

క. ఘనమతిఁ దూర్పుగఁ బద్మా, సనమునఁ గూర్చుండి చెంబు జపమాలను గ
ట్టును, గృతిఁ జతుర్భుజంబులఁ, గొని బుధనుతుఁ దగుగురుగురు మతిఁ గొల్తున్. 2

క. దివ్యహారు దివ్యరుచియగు, దివ్యరథంబెక్కి మేరు దివ్యగృహాద్రిన్
సవ్యగతిఁ జుట్టివచ్చెడు, దివ్యగురుం గొల్తు భవ్య దివ్యద్భక్తిన్. 3

ఉ. ముప్పదిమూఁడుకోట్ల బుధపుంగములేఁ బదియాఱు కోటులై
ముప్పుల నిచ్చు రక్కసుల మూఁకల గెల్చుట కెల్ల శక్తిమైఁ
దప్పక నిన్నుఁ గొల్చుటఁ గదా! యిటు శ్రీబుధజీవనాటనీ
వొప్పు మనుంటి జీవుఁడను నుత్తమనామముతో గురుగ్రహా. 4

మ. గురుయుష్మత్ప్రియ చర్యమానిహరి ముఖ్యుల్ చాల పారుల్ సు
చరసంఘాతముచే స్వరాజ్యపదవీ సౌఖ్యంబుఁ గోల్పోయి పొం
దిరి చిక్కుల్; గురుపూజమాని బుధులున్, నిశ్శేషపుణ్యావళీ
పరిపూతత్వము గానకుండిరి? గురుశ్రీ వన్మండలస్థా! గురూ! 5

క. మండలమండలములనీ, మండలమె వెలల్పుకుటఁ గుమండలగసుధీ
మండలమెల్ల బృహస్పతి, మండల మన్నారు నీదు మండలమును గురూ. 6

చ. నిరుపమ హేమవర్ణకర నేత్రములుం గడు పెద్దదేహమున్
బరమపరోపకారముఁ గఫస్ఫుట తత్త్వము గల్గి యొప్పుచున్
స్థిరబలదివ్యదృష్టిఁ గని చెప్పిన మౌనులఁ దిట్టుమాఘుఁడౌ
మరలన సూక్ష్మసృష్టిగతి, శోభితులన్న దెఱుంగ కో గురూ. 7

మ. ఇలఁ జార్వాకమతంబు నీచరితమం చెంచన్ లఘుజ్ఞాని; లే
ఖులు లేరన్న మతంబు లేఖగురుతం గొన్నట్టి నీవే మతిన్
నలువం బూనుదు? వా బృహస్పతియనం జార్వాకుఁ డంబంపు టా
ఖ్యలలో నాకరటి యా పెత్తింగి కొనరే కాలంపు టల్పుల్ గురూ. 8

క. కనకపట! కనకచామర! కనకచ్ఛత్రాదికనక! కనకపతాకా!
కనక నక్షత్రందవధర! కనకతనూ! పోత్రివు! కినుక కనకనను దయన్. 9

క. సకలాగమాదికలలకు, సకలబుధాలికిఁ బతివయి సకలార్థకరం
బగు కట బృహస్పతి నామము, సకలు సుమతిఁ గన్న నిన్ను నర్చింతురు గురూ. 10

మ. తనహేమంబు సుతుఁ గాఁగ నంగోనుట పార్థంబౌ జనీనామమున్
గని రొయ్యంగోడ; ఆటంగిరస్సుతుఁడవై కంజాతజాంశోద్భవం

వెనయంగీస్పతి నామమున్ స్థిరబుధ జ్యేష్ఠత్వ సద్గౌరవం
బును గైకొన్న బృహస్పతుండలగు నిన్ బూజింతు జీవా! గురూ 11

ఉ. నిత్యము భావివృద్ధిదత నీవలె నీప్రియమిత్రబంధులై
సత్యముగా సుకర్ములను సాఁకెదు నిందిరురత్వధాతలన్
భూత్యసమానులధ్వరసుభోజనతృప్తివహించునీ యధి
ప్రత్యధిదేవతల్ గురుఁడ! పావుత! మత్కులవృద్ధిఁ గోపనన్. 12

చ. ఎదురెటుగన్నలేక చను నేఁబది నొమ్మిదివేల యేఁబదే
గ్మదివశలంగ్రహాళి గమనించు మదుద్భవకాలరాసులం
దెదిగను, చెవ్వరింగలసి, యేఫలకారత, నేయవస్థ, నే
పదమున నున్న నాచరభపక్తిని భద్రమె యిమ్ము; జీవుఁడా. 13

సీ. కష్టవిచ్ఛేదక తుష్టిసంపాదక పూర్ణమోదకగాత్ర పుష్టిధనము
లోకోపకృతిగాత్ర మాకరుణాపాత్ర పూర్ణజీవపవిత్ర పుత్రధనము
స్వానందసంధాన మానాయకధ్యాన పూర్ణబలనిధాన బుద్ధిధనము
దానవిధానప్రధాన హేమవరసుక్షేత్రసౌఖ్య ముఖ్యసాధనధనమ్ము

గీ. నీయుఁ దశాగ్రగకస్వామి వీవె గాన, ఋషులనేలుకొను సద్గ్రహాతిపుణ్యమూర్తి
వంచునిను నమ్మి నీధ్యానమతులభక్తిఁ, జేయుచుంటిని దుమువ్వాంజేప దేవ. 14

సీ. వేద,వేదాంత,సద్విద్యా,యశంబులు,మంత్రిత్వ,పాండిత్య,మంత్రములును,
ప్రణవంబు,శ్రద్ధయు,భక్తియు,మేధయు,బ్రాహ్మణ్య,పరిశుద్ధి, వాక్బలములు,
జయపత్ర, ధన, సదాచార, వైష్ణవధర్మ, శిష్టత్వ ముఖ్యతా శ్రీగురుతలు,
సుఖ, గజాంత్యైశ్వర్యసుత దేవ గృహకర్మ,బాంధవవృద్ధిసుస్వర ముఖములు

గీ. నీప్రసాదఫలము లెగాన నిత్యములుగ, గాత్రమున్నంతవఱకు సత్కరుణనిచ్చి
వ్యాధిమృత్యుజరాభవ వ్యథలు లేని, ముక్తి నిమ్ము టుపైన సత్పూజ్యజీవ. 15

ఉ. శ్రీయుతమత్యవేంకయకు సెందవ పుత్రుఁడు సత్యనూర్యనా
రాయణమూర్తి, సీతనధరాబుధ దత్తకుమారుఁడాదినా
రాయణమూర్తి సేవనపరాయణ కిర్లముపూఁడివాసి, పా
రాయణబుద్ధిలోకము పురాయనఁ జేసె నిటుల్ గురుస్తుతిన్. 16

క. దీనినిఁ జదివిన వ్రాసినఁ, బూనికఁ జదివించి వినినఁ బూజించిన దే
హానూనమనోబలములఁ, బూర్ణసుఖము గాంతురు జనములు జీవదయన్. 17

# శనైశ్చరస్తవము.

శా. శ్రీమద్భాస్కరమండలాప్రతిదిశాశ్రీమందసన్మండలో
ద్దామేష్వాసనరూపపీఠమునఁ బ్రత్యగ్విభ్రుఖాసీనుఁడై
శ్యామాభాంగద కుండలోరుమకుటోద్యత్తారకార్ముకశ్రీసధా
రామాన్యాసిగదాధరుండగు నమోరాట్పుత్రు భావించెదన్. 1

చ. ఘనమగు శ్రాసముఁ గదను గత్తిని వింటిని నాల్గుచేతులం
గొని బలుగ్రిధ్రయూఁపువయిఁ గూర్చిన కార్ముకరూపపీఠమం
దనువుగఁ గూరుచుండినలుపౌనగలుందను నొప్పమేనువుం
బనివడి నిత్యముందరిగి, వద్భు శనైశ్చరు సంస్మరించెదన్. 2

ఉ. ఎండుట మెండు కండగొన కెత్తయి, మిక్కిలిలావు గట్టియు ,
బండతనంబు మెండయిన పాదితయొడల్ గనువిప్పఁగన్నులా
రయుండినపొట్టయున్ నలువు లేనిదు దూపుఖుఁ, జాలజాలుగా
నుండినమీసముల్ జడలు నుండిననల్లనిగాముఁ గొల్చెదన్ .  3

ఉ. వాడినమోముతో సకలభక్తగణశక్తిని ఘోరరూపమై
నాడక నిశ్చయంబురుపు నుత్తమయోగ సుసాధకంబులోఁ
గూడినవస్త్రపోమహిమ కూడికనొందినదైన మేనితో
జాడలమెల్లగాఁదిరుగు సామినినల్లనిగాముఁగొల్చెదన్. 4

చ. మునిసుత కాస్యపప్రభవ మూర్తివహించుట దివ్యదృష్టియుక్
ఘనజనస్థితిప్రళయ కారణశక్తియుఁ బూని కోపమున్
దినయెడ దేశనాశనతి దీనునిఁ జేయుచుఁ దుష్టినం
దిననతిదీనుగన్ సకలదేశపుఁ జేసెడిశాలుఁ గొల్చెదన్. 5

క. నీలోత్పలతుల్యాంగుడు, నీలగళనిభుండు, నిత్యనిరుపమబలుఁడున్
నీలమయాఖుఁడునైతగు, నీలగ్రహమునకొనర్తు నేర్పున వినతుల్. 6

చ. అనయము రాహుకేతువుల యట్లతినీలుఁడవయ్యుఁ దద్విధం
బునఁగనరానికాయమును బూనక భానునుతుండ వాటచే
ఘనమగు నిండ్రనీలమణి కైవడిభాసిలుచుండి లోకముల్
గనుఁగొనిపేడ యోగ్యతను గాంచిననిన్ను భజింతు నో శనీ. 7

చ. సురనరసిద్ధసాధ్యదితిసూనుముఖుల్ భవదీయలోవదృ
క్స్ఫురణనశింతురాదనుజసూదనధాతృముఖుల్ స్వరాజ్యసా
గరసుతఁబాసిమూసెదరు; కంధిలతాపురవృక్షముఖ్యముల్
హరణమునొందు; నీకరుణ నన్నుయుమేలుకొనుమీ శనైశ్చరా. 8

శా. నీవేల్నాడయి వచ్చుటన్వనిలమున్ నీవేమియుంజేయఁగా
లేవంచుంబురిఁబాసి కారడవిలోఁ లీలన్ సరోమధ్యరా
జీవంబందలినాళమందులఘుతం జీవించె నేడేఁడులుం
దేవేంద్రుండె; నరుండుదాఁటఁగలఁడే? నీయాజ్ఞఁ గాలగ్రహా. 9

మ. నిజపుత్రేంద్రజిదుద్భవంబగుతఱిన్ నిర్మృత్యుఁడై వాఁడుభూ
ప్రజలోనుండ గ్రహాళిలాభనసతిన్ బంధించెనారావణుం
డజపౌత్రుండయినన్ భవద్వ్యయపద స్థాంఘ్రిన్ మృతింబొందెనాఁ
డజదుర్లంఘ్యభవద్విధింగడతురే? యజ్ఞుల్ నిశాటుల్ శనీ. 10

చ. ఘనకృశదీర్ఘదేహమును, గంటకరోమగణంబు మందవ
ర్తనకపిలాక్షులుం బవనతత్త్వము దారుణదీర్ఘదంతముల్
దనరఁగ మండలస్థితినిఁ దాల్చిననిన్నురుదివ్యదృష్టిచేఁ
గనిమునులెల్లఁజెప్పనది కల్లనుమూఢుఁడు; సూక్ష్మభార్గజా. 11

క. నీదానహోమజపములు, భూదేవతలధికముగను బొనరించెదనీ
మేదినిగ్రహములలోపల, నీదగుగురుతఁగనికాదె? సిద్ధేశశనీ. 12

ఉ. ఎంతశనిగ్రహంబవని యెన్నికగాంచితొ తుష్టినొందితే
నంతయనంత సౌఖ్యమిడుదారయుఁ; జేఁదగుమందెలిన్నరో
నెంతటిరోగముంజెఱిచి యింపులనింపునుగాన ధీరులెం
తెంతటిపూజలోనలిపి యొంతురునిన్ను గ్రహాధిరాట్సుతా. 13

ఉ. నిత్యము శాశ్వతాయువిడ నీవలెఁగారకులైననాగులై
సత్యముగానిజాశ్రితుల సర్వశుభాఢ్యులఁజేసిప్రేమ సాం
గత్యసుహృత్ప్రజాపతియుఁ గాలుఁడునాఁదగియున్న నీయధి
ప్రత్యధిదేవతల్ రవిజ! పాపుత! మచ్చిరజీవభంగముల్. 14

క. కాలపటు! కాలదామర! కాలద్యుతాంగ! కాల! కాలపతాకా
కాలసృక్చందనధర! కాలవృష! యిమ్ముమృత్యుకాలజయంబున్. 15

క. కాలవశా! కాలయశా! కాలదృశా! కాలసదృశ! కాలవినాశా!
కాలధరా! కాలచరా! కాలవరా! యిమ్ము మృత్యుకాలజయంబుల్. 16

క. అనయముఁ బ్రారబ్ధంబున, ఘనరోగావళులపీడ గనుచుండ జన్మం
బనుమృత్యువుఁ జూడనుభయ, మునుగను నాకిమ్ము ప్రసాదమును సూర్యసుతా. 17

క. కరముగ నికరము నగదిన, కరనుత! యాయువిడుము! బలకరమై, ప్రమదా
కరమై, కరమై, స్థిరమై, వరమై, వరమైతరేయ ఫలమిడకుండన్. 18

చ. ఎదురెటుగన్న లేక చను నేఁబదితొమ్మిదివేల యేఁబదె
న్మిదివశలం గ్రహాళి గమనించు మదుద్భవకాలరాసులం
దెదిగను, చెవ్వరింగలసి, యేఫలకారత, నేయవస్థ, నే
పదమున నున్న గోచర ఫలస్థితి భద్రమె యిమ్ము; కాలుఁడా. 19

క. ఈనాఁడానాఁడనకీ, వేనాఁడు విశేషవిధిని నేల్నాఁడైనన్
నేనాడు వినుతిలోపము, పోనాడితి భానుభూతిఁ బూనింపుశనీ. 20

సీ. పారిదర్యపేరిష్య బంధనగ్రహణ శిక్షాగేహ భృతినైచ్య కష్టజయము
ద్యూతపానకుమంత్రి దుస్సహావాస, కిరాతశూద్రక్రియా వరిమఖజయము
కార్యభంగ క్లేశ గాధవ్యసన మౌర్ఖ్యవాతాము యమదాది భయవిజయము
ములలోహకంబళీ తిలతైలభాండ నీలాంబర ఖర మృత్యులందకుంట
గీ. శిల్పపాదుకా ప్రాభవశివములనిడు, కారకుఁడవౌట వానిసీకాయముఁదు
వఱకునిడి జన్మవార్ధకవ్యాధి మృత్యు, రహితముక్తి నిమ్ముటుపైన రవితనూజ.

# శనిసవదండకము



శ్రీమన్మహాపావనంబైన శ్రీసూర్యవంశంబునం బూర్వకాలంబునన్ ద్వీపనప్తాదినాథుండు, సద్యశోవర్ధిద్ధ విఖ్యాతినొందువాఁడై దశస్యందనేశుండు కౌసల్యకైకన్ సుమిత్రన్ వరప్రీతిఁ బెండ్లాడి పూజ్యంబుగా రాజ్యమెల్లం దయాపూర్ణుఁడై యేలుచుండంగ నాకొన్ని దైవజ్ఞులా ప్రీతులేతెంచి శ్రీమన్మహారాజ! రాజాధిరాజా! మహాశూర! శన్యాఖ్య ఘోరగ్రహం బిప్పుడారోహిణీ శార

నారోహణప్రక్రియం బొందు రేపేయటుల్ శాకటర్క్ష ప్రభేదంబు సేయంగ దేవాసురాద్యాతిభీతిప్రదంబౌదుఁ బండ్రెండు సంవత్సరంబుల్ మహాదారుణంబైన దుర్భిక్షమేతెంచు నట్టేట దేశంబులుం గ్రామముల్ సర్వలోకంబులుం జాల కంగారుచే భంగముం బొందునంచున్ వచింపందదీశుండు మంత్ర్యాళితో నాకులం బొందు రాష్ట్రప్రజా సంఘముం జూచి భీతిన్ వసిష్ఠాది సద్బ్రాహ్మణ శ్రేష్ఠులం గాంచి సర్వజ్ఞమౌనీశులారా! మహాదారుణ క్షామభంగంబు గావించు మేలౌ నుపాయంబు నేదేనియుం జెప్పరే! యందు వేఁడంగ వారల్ మహారాజ! యీయోగ మాబ్రహ్మరుద్రాదులేతెంచియున్ మాన్పఁగాలేరు, మేమే యుపాయంబు నూహింపలేమందుఁ జెప్పం దశస్యందన క్ష్మాధినాథుండు చిత్తంబులోఁ గొంత చర్చించి బల్ సాహసంబూని శుభ్రాశ్వసంయుక్తమై పెద్దజెండాను వెల్గొందు మాణిక్యకాంతిచ్ఛటా స్వర్ణతేజోమయంబై వసిష్ఠర్షి మంత్రప్రభావంబుచే సర్వదిక్కుల్ చరింపన్ మహాశక్తి గైకొన్న సుస్యందనం బెక్కి దివ్యాయుధోపేత చాపంబుచేఁ బూని భాస్వత్కిరీటస్థ మాణిక్యకాంతిచ్ఛటల్ దన్నునాకాశవీధిం ద్వితీయార్కరీతిం బ్రకాశింపఁజేయంగ మార్తాండుపై లక్షపై నిర్వదైదామడల్ దూరముం దున్న యారోహిణీతారవెన్నంటి యాకృత్తికాంతంబు నందుండి యారోహిణిం బొంద సిద్ధంబుగానున్న మందగ్రహంబున్ మతిం బొందఁజేయంగ సంహారకాస్త్రంబు సంధించి నిల్వంగ నాసౌరి దేవాసురాద్యాతిభీతిప్రదక్రోధవహ్నిజ్వలద్భ్రూకుటీయుగ్మవిభ్రాజినాయాజి నీక్షించి హాసంబు గావించి యిట్లాడెనో రాజ! విద్వేషులం జాలఁ భీతిల్లఁగాఁజేయు నీపౌరుషం బెంతొ మోదంబిడెన్ నాకు దేవాసురుల్ సిద్ధవిద్యాధరుల్ మర్త్యులున్ నీమహాతీక్ష్ణమౌ దృష్టిసోఁకన్ భయభ్రాంతులౌచుందు రీయుష్మత్తపస్సిద్ధికిన్ మెచ్చితింగోర్కె నేదేనియుం గోరుకో మీమ్మయుద్ధంబుగానుంటి నాఁ గందశస్యందనాధీశుఁ డీరీతిగాఁ బల్కె నో కాలనామాంతిభీమగ్రహాధీశ్వరా! వారిధుల్ సూర్యుఁ డిందుండు నిందుండు దాఁకన్ సుఖంబొందుచుం గృత్తికం గూడి భాసిల్లు మెల్లప్పుడున్ రోహిణిం బొందఁగాఁబోకు మీయొక్క కోర్కెం బ్రసాదింపు నాకంచు వేఁడంగ నాసౌరి యోవెఱ్ఱిరాజా! దుమందేవుఁ డెల్లప్పుడున్ సర్వనక్షత్రసంచారముం జేయనేర్పర్చె నట్లుండఁగాఁ జెల్లదే రోహిణిం బొందినం దేనినిం బొందినన్ క్షామబాధల్ జగంబందు నేఁడాదిగా నుండవే వేళ నాదర్శనం బాశ్రితాళిన్ వృథాసేయదంచున్ వరంబీయ నాయాజిధన్యత్వముం

గాంచి సంతోషమెచ్చఁగ రథంబందుఁ గోదండముం బెట్టి హస్తంబులఁ మోడ్చి విఘ్నేశ్వరుఁ భారతిం దొల్త ధ్యానించి భక్తిఁ శనిస్తోత్రముం జేయ నిట్టుల్ మొదల్ వెట్టెఁ గృష్ణుండు, శితికంఠతుల్యుండు, నీలోత్పలాభుండు. నీలవర్ణాభుండు నాశ్రీశనిస్వామికిఁ నానమస్కారకోటుల్ సమర్పింతు, నిర్మాంసదేహుండు, భాస్వజ్జటాశ్మశ్రుదీర్ఘుండు, రూక్షాక్షియుగ్మండు, శుష్కోదరుండౌ శనిస్వామికిఁ నానమస్కారకోటుల్ సమర్పింతు ఘోరుండు, రౌద్రుండు, సర్వాశనమ్లానవక్త్రుండు నాశ్రీశనిస్వామికిఁ నానమస్కారకోటుల్ సమర్పింతు. నిస్త్రింశుఁడుఁ మందచారుండు, భాస్వత్తపో దగ్ధదేహుండు, నశాంత సద్యోగనిష్ఠుండు, సుజ్ఞాననేత్రుండు, భాస్వత్కుమారుండు నాశ్రీశనిస్వామికిఁ నానమస్కారకోటుల్ సమర్పింతు, నో శ్రీశనిస్వామి! చిత్తంబులో నీవు సంతుష్టిఁ గైకొన్న రాజ్యాదిభోగ ప్రదాగంబుగా వింతు నాక్రాంతకోపంబు గైకొన్న శీఘ్రంబుగా మృత్యునోటంబడఁ దైత్యవాదిత్యులఁ రాక్షసుల్ మానవుల్ పన్నగుల్ సిద్ధవిద్యాధరాదుల్ భవద్దృష్టి సోఁక న్నిమేషంబులో దీనులై పోదురా బ్రహ్మగోవింద్రయాదః పతిశ్రాద్ధ దేవాదిదేవాధినాథుల్ భవత్క్రూరదృష్టిఁ స్వరాజ్యాధికారంబులం బాసి దుఃఖంబులం గందురీ; దేశంబులుం గ్రామముల్ ద్వీపముల్ చెట్లు తీఁగల్ మొదల్ గల్గు దృశ్యంబులెల్లఁ భవద్దృష్టి దాఁకఁగ మొదల్ తోడ నాశంబులై పోవు, నో శ్రీశనిస్వామి! దుర్వారశక్తీ! ప్రజాసౌఖ్యముం గోరి నీసన్నిధిం జేరి నిల్చి వేఁడుచున్నట్టి నన్నుఁ భవద్దాసుఁ బ్రీతింబ్రసాదోరు కారుణ్యవీక్షుండవై చూచి రక్షింపు రక్షింపు రక్షింపుమో శ్రీశనిస్వామి! యో శ్రీశనిస్వామి! యో శ్రీశనిస్వామి! నేనీకుఁ గావించు జోహారిదే యంచు మ్రొక్కంగ నా సౌరియాజి స్తుతింజాల సంతుష్టుఁడై పల్కె, నో రాజ! నీస్తోత్రమెంతో ముదంబిచ్చె నాకిప్పుడే దేన్వరంబీవు వఁ గోరుకొమ్మిత్తునందు న్వచింపం దశస్యందనేశుండు దానిట్లు గాంక్షించెనో శ్రీశనిస్వామి! నేఁటాది గా నీవు గీర్వాణ దైత్య ప్రజాజంతు పక్ష్యాదికప్రాణులం బీడగావింపుటన్మాని సౌమ్యస్వభావంబుతో మంచివాఁడన్న సత్కీర్తి భాసిల్లవే! యందు వేఁడంగ నా సౌరి యిట్లాడెనో క్షత్త్రరాజా! జగద్ద్రోహకత్వంబుచే మాకుఁ బీడాకరంబౌ గ్రహాఖ్యల్ మహాదేవుఁడేర్పర్చెఁ గానఁ భవద్యాచితంబౌ వరంబీయఁగాఁ గూడదైనన్మహాభక్తి నీవిప్పుడిద్దానిచే నన్ను సంతుష్టుఁగావించి తౌ నా స్తుతిఁ మర్త్యుఁడే రోజు నేకైకపర్యాయముల్ పాఠముం జేసినం బీడ యొక్కింత

యుంబొందఁ డెవ్వారిచేనైనఁ బారంబు సేయించినను వానికే వేళలం బీడరాకుం డుః జన్మాష్టమద్వాదశ స్థానగతత్వంబునేనొందు వేళ న్మనుష్యుండు శ్రద్ధన్ శుచిత్వంబునన్ శుద్ధసత్వాంతుఁడై మందవారంబునన్ మామకంబౌ నయోలోహరూపంబు పూనికన్ శమీపత్ర పుంజంబుచే నీఘనస్తోత్రమార్గంబునన్ నన్నుఁ బూజించి యీస్తోత్రమున్ నామహామంత్రరాజంబు నిష్ఠం జపింపన్ముదంబంది నేవారి పీడల్ నివారించి కోర్కెల్ సదా యిచ్చుచుందున్మదిందీవి కేమాత్రమున్ సందియుంబందఁగాఁ గూడదంచున్ వచింపం దశస్యందనోర్వీశుఁ డానందియై సౌరియాజ్ఞన్ స్వధానింబ్రవేశించి యారీతిగా రాష్ట్రమర్త్యాళికిం జెప్పిచేయించి తాఁ జేసి పీడావినాశంబు దుర్భిక్షనాశంబుగావించె మందగ్రహారాధనం బెల్ల వర్ణోద్భవుల్ సేయఁగానొప్పు శూద్రుల్ విశేషించి ముఖ్యంబుగాఁ జేయఁగానొప్పు నంచున్మహోద్యత్ప్రభాజాత సంపూర్ణమాహాత్మ్య సంపన్నుఁడై దివ్యశక్తి ప్రదాథర్వణామ్నాయభాగంబు దేవుండు మాటల్గ బోధించియుండంగ వానిన్ మహామంత్రముల్గాఁగ మేలైన ఛందస్సుతోడం గవిత్వంబు గావించి ప్రఖ్యాతిచే బ్రహ్మతోఁ దుల్యుఁడైయున్న శ్రీగాధిపుత్రుండు, బ్రహ్మర్షిపూజ్యుండు, బ్రహ్మర్షిముఖ్యుండు, లోకోపకారోద్యదీక్షన్ శనిస్తోత్రచారిత్రమీరీతి లోకంబునం దెల్ల వ్యాప్తంబుగాఁ జెప్పె; నో సౌరి! కృష్ణా! శనైర్గామి! ఖంజా! యమా! లోకవైరీ! గ్రహాధీశసంభూత! ఛాయాసుతా! మాతలీ! నారకా! రాక్షసా! సర్వలోకాంత! రక్తాక్ష! యుద్ధప్రియా! కుబ్జ! మందా! ప్రమత్తా! మహాస్థూల! శ్రీవేదబాహ్యప్రజానాశ! యో శ్రీశనీ నన్నురక్షింపవే! యంచు నీయుక్తదో కాఖ్యలన్ మూఁడుసంధ్యల్ జపింపన్ శనిప్రీతి యౌటందదీయోరు పీడల్ జనుల్ పొందరే వేళనందున్ శరంమానియున్ శాపముం బెట్టియున్ శత్రులుం జంపఁగాఁ జాలు శ్రీగాధిభూదేవుఁ డత్యంత పుణ్యుండు వ్రాకుచ్చెఁ; గోణస్థ! యోపింగళా! యో బభ్రూ! మహాకృష్ణ! రౌద్రా! యమా! యంతకా! సౌరి! మందా! శనైర్గామి! నన్గావుమంచీ దశాఖ్యల్ పఠింపన్ నరుల్ పొందరే వేళనైనన్ శనిప్రోక్తపీడాముఖంబుల్ ఘనఖ్యాతియౌ పిప్పలదర్శి సెప్పెన్. జగంబందు నీమూఁడుమార్గంబులన్ మీఱు నార్షేయమౌ శ్రీశనిస్తోత్రముంగల్గి భాసిల్లు నీదండకంబున్ మహాభక్తితోఁ బ్రత్యహమ్మొక్కసారేని పాఠంబుగావించినన్ శ్రీమదధ్యాత్మరామాయణాఖ్యాన పారాయణోక్తప్రకారంబుగా శ్రీశనిస్తోత్ర పూజోక్తమౌ సత్ఫలంబంది మర్త్యుల్ సుఖంబంది

యుండరించు నిశ్శేషదేవాది లోకాధినాథున్ రమానాథుఁ జిత్తంబులో నిల్పి పూ
జించుచుందన్మహాపూర్ణకారుణ్య సంప్రాప్తభాస్వత్కవిత్వాభిరామత్వమేపారఁదఁ
గా నత్కృతుల్ చేసికొంచున్ సదా సర్వవిద్యా రసగ్రాహకత్వంబుచే మీఁఱి
గోదావరీఖండ పెద్దాపురీ భాగమందొప్పు శ్రీకిర్లమాఖ్యాన్విత శ్రీపురిం గాఁపురం
బుండి సద్భక్తిశాలోత్తమానందసంపూర్ణ సంపన్నుఁడైయొప్పు శ్రీముత్యవంశో
ద్భవాత్యంతధీ సూర్యనారాయణాఖ్యాగ్రజన్ముండు వాక్రుచ్చు నో శ్రీశనిస్వామి!
మందప్రచారా! గ్రహాధీశ భాస్వత్కుమారా! దయాసార! యాకీర్తిఁ గావించి లో
కంబులన్ బ్రేమ రక్షింపవే! శ్రీశనిస్వామి! కైకొమ్ము నీకేమ గావించు సంపూర్ణ న
వ్యక్తి సంపన్న సుశ్రీ నమస్కార వారంబిదే! శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ. శ్రీ. శ్రీ.

# బుధస్తవము

శా. శ్రీమద్భాస్కర మండలేశ్వరదిశా శ్రీసౌమ్యసన్మండలో
ద్ధామద్వ్యష్టకరూపపీఠిని మహోదగ్దిఙ్ముఖాసీనుఁడై
హేమాభాంగద హేమకుండలకిరీటోద్ధాంగ హేమాభుఁడై
శ్రీమచ్చర్మగదాకుఖడ్గకరుఁడౌ శ్రీసౌమ్యు భావించెదన్. 1

క. కనకాంగమకుటపటములు, దనరఁ జతుర్భుజములమగ దాచర్మాక్షో
సిసిరుపమవస్తువులుదగఁ. బనివడి హరినెక్కినతిప్రోతుందలఁతున్. 2

క. పీతపట! పీతచామర! పీతచ్ఛత్రాద్యుపేత! పీతపతాకా!
పీతస్రక్చందనధర! పీతతనూ! నిన్నుఁ దలఁతుఁ బ్రీతిం బ్రోవన్. 3

మ. సతిశాపాహతయా నిశాపతికి భాస్వచ్చంద్రమోవంశమున్
సతికారుణ్యముచే మగండయిన తత్సత్కాంతకే సూర్యసం
తతియుంబుట్టఁగఁజేసి తన్నిపుణతం దత్తత్త్వరాణక్రియ
స్థితికిన్ మూలమువై వెలుంగు నినుఁ జింతింతున్ సుధాంశోద్భవా. 4

ఉ. ముప్పదిమూఁడుకోట్లుగల, ముప్పదియేఁడుల పెద్దలందఱుం
జప్పుకున్ సమూహనిధిచే బుధనామమునొందిరీవె రా

ల్లప్పుడు శ్రీబుధాభిధనె యుందితి; నీకుసమానులేరి? ని
న్నెప్పుడుఁ గొల్చుసన్మతులహీనబుధత్వముఁ బొందరే? బుధా. 5

చ. సకలకలావిశారదత సద్గురుఁడైన సుజీవు కాంతకున్
సకలకలావిశాలతను సన్నుతిఁ గన్న సుధాంశుమూర్తికిం
బ్రకటసుతుండవైననిను భవ్యకలావలుఁ బొందకున్నె? నీ
ప్రకటదయం గడించుకొను వారు కలావలిఁ బొందరే? బుధా. 6

క. అమృతాంశాంశోద్భవుని, న్నమితసుసౌమ్యత్వవిభవునాత్మనిలుపు ను
త్తమతనుహృత్తాపనముద, యముయమునిఁ జేరకున్నె? యలఘుమతి బుధా. 7

ఉ. స్థూలశరీరదృష్టినినుఁ జూచినచోఁ బ్రియంబదంబ్రస
న్నాకులగుణజ్ఞులౌ బుధులు; దాంతతసూక్ష్మశరీరదృష్టి నీ
లీలనుజూచనేర్చినది లింగతనుప్రియంబుసేసి ని
త్యాలఘుసౌఖ్యమిచ్చు నమృతాప్తినిభక్తులకీయదే? బుధా. 8

ఉ. స్థూలశరీమూనిఝుల శోభిలిపిమ్మటఁ గాంతిభూతమై
కాంలెడుసూక్ష్మదేహమునఁ గామవిహారత, మండలస్థితిం
జాలవెలుంగునీచరిత సత్యమెఱుంగఁగ లేక వృూనిరా
జ్ఞాలవచఃపురాణముల సారెకుమాఱును మూఢుఁడో బుధా. 9

క. పరిహాసభావ, గద్గద, పరగళ, ధాతుక్రియాంగభాగుఁడవగునీ
వరరూపముసెప్పినబుషి, వరులన్నిందించుఖలుఁడు; పాణ్ణేందుసుతా. 10

మ. నరసాన్నాంబరదౌషధీశుఁడగు యుష్మత్తాతుఁడస్మత్ప్రభుం
డరయన్నిత్యము యుష్మదాంబికసుతారాచ్ఛత్వముల్ నీబుధ
త్వరుచింగోరు మహర్షిజాతులము, నీబాంధవ్యమెల్లప్పుడున్
స్థిరమైయున్నదెమాకు; నేలుకొనవే! శీఘ్రంబెమమ్మింబుధా. 11

క. అవనిన్ "సోమఃపవిత్రమో,వివిదే" యనియున్న వేదవిధి చేనీవ
న్నవుపేడ్డవునైపలు వా,వివమనలఁగలసితివిమమువిడువకుము బుధా 12

క. ఘనపుణ్యముచే నాకం,బునని లిచినకలజగములుఁ బూర్ణసుదృష్టిం
గనుచున్న నీవుఫలమీ,యనిచోదికెక్కువరు ? జడులమగు మాకు బుధా. 13

ఉ. నిత్యముసౌమ్యభావమున నీవలెనీమదినున్న యాద్యులై
నశ్వముగానమగ్నులురుశాశ్వతమోక్షమునొందఁజేయు సాం

గత్యముతోడఁ జేయుమహీకాంతుఁడు, బ్రహ్మమునన్న నీయధి
ప్రత్యధిదేవతల్ బుధుఁడ! పావుత! భీకరమత్తమంబులన్. 14

చ. ఎదురెటుగన్న లేక చను నేఁబదితొమ్మిదివేలయేఁబదే
న్మిదిదశలంగ్రహాళి గమనించుమదుద్భవకాలరాసులం
దెదిగను, చవ్వరింగలసి, యేఫలకారత, నేయవస్థ, నే
పదమునమున్న, గోచరభపఙ్క్తి నిభద్రమెయిమ్ము! సౌమ్యుఁడా. 15

మ. స్థిరమౌకేవలసద్బుధాఖ్యను, బుధజ్యేష్ఠత్వసంపన్నతన్,
వరవాణీచతురాస్యసంపదను, శిల్పప్రౌఢసృష్టిక్రియన్,
హరిపాదాత్తగతిన్, బయోజజతిబ్రహ్మాణ్యండవైయుందునీ
స్థిరభక్తిం దలఁతుం జిరాయువిడి రక్షింపంగరావే! బుధా. 16

సీ. కౌమార, వాణిజ్య, కావ్య, గణిత, లిపి, బుద్ధి, యుక్తులు, శిల్ప, పుణ్యగతులు,
మాధ్యస్థ్య, సంధాన, సహిత చాతుర్యముల్, నౌకాగమన జయ, నయగుణములు,
ముద్గాది సస్యసంపూర్ణలాభఁబులు, సౌభాగ్య, కన్యకాసంతతులును,
వ్యజన, పంజర, కీర, వరవిచిత్రవిహార, తాంబూల, సంభోగతతసుఖములు,
గీ. నీవొసఁగుఫలములె గాననిత్యములుగ, గాత్రమున్నంతవఱకుసత్కరుణనిచ్చి
వ్యాధిమృత్యుజరాభవవ్యథలు లేని, ముక్తినిమ్మటుపైనసత్పూజ్యసౌమ్య. 17

ఉ. శ్రీయుతముత్యవెంకయకు రెండవపుత్రుఁడు. ముత్యసూర్యనా
రాయణమూర్తి, సీతనధరాబుధదత్తకుమారుఁ, డాదినా
రాయణమూర్తి సేవనపరాయణ కీర్లమపూఁడివాసి, పా
రాయణబుద్ధి లోకముపురాయనఁ జేసెనిటుల్ బుధస్తుతిన్. 18

క. దీనినిఁ జదివిన, వ్రాసినఁ, బూనికఁ జదివించివిన్నఁ, బూజించినదే
హానూనమనోబలములఁ, బూనిసుఖముగాంతురుజనములు సౌమ్యదయన్. 19

# కేతుస్తవము

శా. శ్రీమద్భాస్కరమండలానిలదిశా శ్రీకేతుసన్మండలో
ద్దామశ్యామలకేతుపీఠమున సద్ధ్యామ్యాసనాసీనుఁడై
హేమాభాంగదచిత్రకుండలకిరీటోద్ధాతిధూమ్రాంగుఁడై
శ్రీమద్బ్రహ్మగదాసిశూలకరుఁడౌ శ్రీకేతువుంగొల్చెదన్. 1

క. అవనీచ్ఛాయకుఁ గేంద్రం,బవుశుభ్రాంశునకుఁ గేంద్ర మవురాశినిరా
హువునకు నేఁడిట నమృతకరవరచ్ఛాయఁదగు కేతుఁ బ్రార్థింతు మదిన్. 2

చ. అమృతముఁ గ్రోలు దైత్యు హరి యారసి గొంతుకఁ గోయ బ్రహ్మ స
ర్పమొకటిఁ గోసి తోఁకఁ దల వానిశిరంబున మేనఁ దిన్నగా
నమరిచి రాహు కేతువు లటంచు వచించి ఖవాసమీయఁ బై
నమరిక నిష్ఠ రాహువను నార్యను తింగొను కేతుఁ గొల్చెదన్. 3

క. తనకతికించిన ఫణిపతి, ఘనజైమినిగోత్రుఁడగుట గాత్రాగ్రారం
బును శిరమె యగుట జైమిని, మునిగోత్రుఁడనఁదగు కేతు ముదమునఁ దలఁతున్. 4

చ. ఘనగద, శూలచర్మములఁ గత్తిని నాలుగు చేతులందుఁ జే
కొని యహిరాట్ఫణావికృత ఘోరముఖంబును ధూమ్రవర్ణమౌ
తనువు నెసంగఁ బావురపుఁ దత్తడితో నపసవ్యచారతం
బనివడి మేరువుం దిరిగి వచ్చెడు కేతువు సంస్మరించెదన్. 5

క. చిత్రపట! చిత్రచామర! చిత్రచ్ఛత్రా! విచిత్రచిత్రిత కేతూ!
చిత్రస్రక్చందనధర! చిత్రప్రభ! ప్రోవు! గాత్రచిత్రను కేతూ. 6

సీ. మంత్రతంత్రక్రియా మహిమచే నొప్పారి పక్షిశకునములు పలుకఁగల్గి,
రోగచికిత్సలు బాగుగాఁ జేయుచు, నుపకారము మఱవ కొప్పుచుండి,
పాములం బట్టెడు వాండ్రను భిక్షుని బైరాగివాని రూపమునఁ బోలి
తీర్థయాత్రాదికము దీపించి, దైవబలమున యోగాభ్యాసమమరఁ బూని
గీ. శంకరకులజాతుండవై చంద్రచాయఁ, దనరు నిను దివ్యదృష్టిచేఁ గనిత పనులు
ప్రజలకందఱికిని జేటవఱువనద్ది, కల్పితంబను మూఢుఁడు కనకధూమ్ర 7

మ. నిను నారాహువుఁ గూర్చి కొందఱు సుధీనేత్రశులే వ్రాయకం
టను వీరల్ గ్రహనామబాహ్యులనియాడం జంకఁడొకండు; మీ
ఘనసత్కృత్ప్రద శాఫలంబులెట దాఁగంబోవు? నజ్ఞానుల
న్నను నాక్షేయము సత్యమై చనునె? నానావర్ణదేహా! ధ్వజా. 8

మ. ఎదురెటుగన్నలేక చను నేఁబదితొమ్మిదివేలయోఁజనా
స్త్రదిదశలం గ్రహాళి గమనించు మదుద్భవకాలరాసులం
దెదిగను, చావ్వరింగలసి, యేఫలకారత, నేయవస్థ, నే
పదమున నున్న, గోచరప్రవర్తినతి భద్రమెయిమ్ము! కేతువా. 9

ఉ. నిత్యముఁ బూర్వకర్మగతినింపినొసల్పను వ్రాయుబ్రహ్మ య
న్నత్యజగద్విభుండు, నథు నాతనకర్త్రయు వ్రాయుధర్మరా
డ్భృత్యక చిత్రగుప్తుఁడను సృష్టివిలేఖుఁడునన్న నీయధి
ప్రత్యధిదేవతల్ మదఘపఙ్క్తులవ్రాయక కావుతన్ ధ్వజా. 10

క. శాత్రవమిత్రత, గాత్రపవిత్రత, క్షేత్రసులతాలవిత్రతఁ, బాత్రీ
పుత్రకళత్రసుగోత్రతఁ, జిత్రాన్విత్రతనిమ్ము! విచిత్రగాత్రా. 11

సీ. పైత్య, లోభ, కలహ, పైశున్య, దంభోక్తి, హితభేద, విపద, సతతజయము
భిక్షాటన, వికార, కుక్షింభరిత్వ, గుహాప్రవేశాదిభయవిజయమును
కార్తాంతికత్వ, సత్కీర్తి, చికిత్సకతా, శాకునికతా, ప్రతాపములును,
జ్ఞాన, వైరాగ్య, మోక్ష,మత, నిధ్యంజనసాధనా,ద్భుతకర్మ, శైవగతులు
గీ. నీవొసంగుఫలములెగాననిత్యములుగ, గాత్రమున్నంతవఱకునతర్కుణనిచ్చి
వ్యాధిమృత్యుజరాభవవ్యథలులేని, ముక్తినిమ్ముపైనసత్పూజ్యమూర్తి. 12

ఉ. శ్రీయుతముత్యవెంకయకు రెండవపుత్రుఁడు, ముత్యసూర్యనా
రాయణమూర్తి, సీతసధరాబుధదత్తకుమారుఁ,డాదినా
రాయణమూర్తి సేవనపరాయణ కిర్లమపూఁడివాసి, పా
రాయణబుద్ధిలోకమవురాయనఁజేసెనిటుల్ ధ్వజస్తుతిన్. 13

క. దీనినిఁజదివిన, వ్రాసినఁ, బూనికఁజదివించివిన్నఁ, బూజించినదే
హానూనమనోబలములఁ, బూనిసుఖముగాంతురు జనములు కేతుదయన్. 14

# శుక్రస్తవము.

శా. శ్రీమద్భాస్కర మండలాదిమదిశా ప్రశుక్రసన్మండలో
ద్దామప్రాఙ్ముఖ పంచకోణవిశదోద్యత్పీఠికాసీనుఁడై
హేమాభాంగదవజ్రకుండల కిరీటోద్ధాక్షమాలాకృతి
శ్రీమద్దండకమండలూరుజటుఁడౌ శ్రీకావ్యభావించెదన్. 1

క. శ్వేతాంబరు, శ్వేతాశ్వుని, శ్వేతధ్వజచామరాద్యు, శ్వేతచ్ఛత్రున్,
శ్వేతస్రక్చందనధరు, శ్వేతాంగుని, శితశీలు, శ్రీకవిఁదలఁతున్. 2

క. దివ్యహాయ, దివ్యరుచియగు, దివ్యరథంబెక్కి మేరుదివ్యగృహాశ్రిన్
నవ్యగతిఁజుట్టివచ్చెదు, దివ్యవరున్ నిన్నుఁదలఁతు దివ్యాకారా. 3

క. భయకరరాక్షసరాజని, చయహర! ధృతరామనామసంతతకీర్తీ!
నయవినయాశ్రితశివకళ! వయఃకలితగాత్ర! భార్గవా! నినుఁదలఁతున్. 4

క. సకలగ్రహములలోపల, నకలంకరుచిం ద్వితీయహరివైతతూ్వ
ర్ణకరుసమీపంబునది, వ్యకళంకసాన్నురునిన్ను భావింతుఁగవీ. 5

మ. మృతసంజీవినిశక్తివాకదునికిన్ మేనంబ్రవేశించుటన్
మృతిభీతిన్ విడువంగఁజేయుటను "శ్రీమ్లేచ్ఛాశనంబాసురన్
కిరిదేవుండు గ్రహింపరా" దనినడన్ శిక్షించి యాత్మానుభూ
తతఁదత్పావనివృత్తి నిల్పిననినున్ ధ్యానింతుఁగావ్యప్రభూ. 6

మ. తనపాదంబునగట్టితన్నుదిని "త్వత్పాదంబుబల్ నొప్పిసే
సెనె" యంచుంగొనియొత్తుభార్గవిభవున్ శ్రీశాంతుయజ్ఞేశ్వరుం
డనిశాసించినబ్రహ్మమౌని భృగుపూజ్యజ్యేష్ఠపుత్రుండవౌ
నిను శ్రీమాధవభక్తిసిద్ధివడయన్ జింతింతు శాంతింగవీ. 7

మ. అనఘ శ్రీహరిభక్తుఁడౌహరియెతన్నర్థించినం దేహమై
నన్ సంగన్ వెనుదీయఁడంచుబలి "కానారాయణుండీవటుం"
డనుచుం దెల్పి బుధుండనే యగుటదివ్యశ్రీబుధేంద్రుంగృతా
ర్థునిఁగాఁజేసిన నీస్వజాతిహితకారుణ్యంబు నెంతుంగవీ. 8

మ. శర్మిష్ఠాసుతయూలమైతనదు వంశంబాస్థిరంబైననా
శర్మిష్ఠోదరముఖ్యకారణము యుష్మత్ప్రతిరయేయాటఁద
ద్ధర్మంబెంచి నిజాచ్ఛధామసదృశత్వద్ధామము న్బ్రేప్సితిన్
శర్మంబొప్పగ్రహించి నీకళఁగొనెంజంద్రుండు మైత్రింగవీ. 9

క. బలమృతసంజీవినినీ, కళఁగొనకుండినకళశితినకళఁగొన్నబుధా
వళికజరామరణంబులు, గలుగనికాయంబునీయఁగలఁడే? శుక్రా. 10

మ. జననంబాయనిమేషులందగుట సుస్థైర్యత్వానమైయొప్పని
కనిమేషాహ్వయరాశి; బ్రహ్మఋషిచర్యన్నిష్ఠగైకొంటఁగ
న్యనునీచాలయదృష్టిఁగంటివపురా! యాత్మానుగుణ్యస్థితుల్
గనుటేలోకమునందునైజమెయొకో! కావ్యా? సుకావ్యాళిదా. 11

మ. భవదాచార్యతచే హిరణ్యకశిపున్ వైకుంఠవైరాది సం
భవుఁగావించితివే! తతగ్రసుతుఁడౌ ప్రహ్లాదువైరాగ్యపై

భవుఁగావించితే! యాత్మజాతకదశాభావాభిధస్థానసం
భవతత్తద్గ్రహచారకారణముచే వర్తించెదట్లోకవీ. 12

చ. సురుచిరగాత్రనేత్రములు, సుందరవక్రవినీలకేశముల్
వరసుసుఖానురక్తి, కఫవాతగతత్వముగల్గి యొప్పనిన్
స్థిరబలదివ్యదృష్టిఁగని చెప్పినమౌనులఁ దిట్టమూర్తుఁడా
సురలనసూక్ష్మదృష్టిగతి శోభితుఁ డౌటరయుంగ కోకవీ. 13

మ. దివిజుకార్యహ్వయమండలాంతరమునందీపించు నీగాథలన్
భువి మూఢాత్ముఁడసత్యమంచు వదరున్ భూమింబలీంద్రాఖ్యభూ
ధవుచే చెంబున సూక్ష్మదేహరుచితో దాఁగన్ సమగ్రుండవా
భవదుద్యన్మహిమం దెలుంగఁగలరే? పాపాత్ములో భార్గవా 14

ఉ. నిత్యము వృష్టివృద్ధి దతనీవలె వృష్టినొసంగు ముఖ్యులై
సత్యముగా జగద్వితతి సారఫలంబుల నొందఁ జేము సాం
గత్యముతోడఁ జేయు హరికాంతయు నిందుఁడు నన్నె నీయధి
ప్రత్యధిదేవతల్ భృగుజ! పావుక! మద్బలభోగభంగమున్. 15

చ. ఎదురెదురుగన్న లేక చను నేఁబది తొమ్మిది వేల యేఁబదె
న్మిదిదశలం గ్రహాళి గమనించుమద్భవకాలరాసులం
దెదిగను, చవ్వరింగలసి, యోఘలకారత, నేయవస్థ, నే
వదమున నున్నఁ గోదరభవశ్రీవిభద్రమె యిమ్ము భార్గవా. 16

సీ. సౌహార్ద, మంత్రిత్వ, సహనతా, ప్రాబల్య, దృష్టి, వకాళ, సువృష్టిఫలము,
లతులితభోగంబు, లంగనాసంభోగ, శయ్యా, వినోద, భోజన, సుఖములు,
కామ, కేళీ, గాన, కౌశల్య, సౌగంధ, సుకుటుంబ, సుకళత్ర, సుఖబలములు,
రజిత, మౌక్తిక, పాండురసువస్త్రవాహన, పాదరక్షా, కవిత్వాదికములు,
గీ. నీప్రసాదఫలములై గాననిత్యములుగ, గాత్రమున్నంతవఱకు నతఁడు రుణనిచ్చి
వ్యాధిమృత్యుజరాభవవ్యథలు లేని, ముక్తి నిమ్మటుపైన సత్పూజ్య శుక్ర. 17

ఉ. ముద్దులకీవి, మోవి, బలుసోయగముం, దెలిజిల్గుపచ్చయం
చద్దినచీరెఁ జూచి మగఁడక్కఁ డొకక్కఁ డొనాకి చెక్కిలిన్
ముద్దుగొనంగ లేవగవు ముద్దులు గులుకఁగ జొక్కపక్కలన్
సద్దని యుంతిలో జెదరు చక్కరబొమ్మ మనోహరప్ప మోకవీ. 18

క. నవ్యకథానవ్యవిధా, భవ్యవధానీవ్రతమగుటఁ బామరవిబుధ
శ్రావ్యంబై, దివ్యంబై, భావ్యంబౌ కావ్యకర్తృపథమిదు! కావ్యా. 19

శా. నానాశ్రీస్మృతిపారగుండయిన ఛందశ్శాస్త్రధీయుంగవి
త్వానూనప్రియుఁడై కృతిన్ స్వజననంబౌ రాశిచక్రంబునన్
నీనిర్దుష్టస్థితిశేకయుండిననిశానింపంగఁ దానింపఁగన్
నానాలంకరణాళిఁ; జాలఁడెవుడున్భవ్యాత్మ! కావ్యా! కవీ. 20

చ. అలఘుగుణాదులిద్ధగతినందనియాశుకవిత్వపద్యల
క్షలును, శతావధానములుఁ, జర్వితచర్వణకావ్యకోటులున్
సలుపుదురల్పచర్చులు; లసద్భవదీయదయన్ సుకల్పనం
జెలఁగెడునొక్క పద్యము రచించినఁ గీర్తికిఁ జాలదే? కవీ. 21

క. ఎందోయున్నదిబ్రహ్మ, నందంబనుచందుగాని; నవనవకవనా
నందమె సాక్షాద్బ్రహ్మా,నందంబది నీవరకరుణం దొరకుఁ గవీ. 22

ఉ. శ్రీయుతముత్యవెంకయకు రెండవపుత్రుఁడు, ముత్యసూర్యనా
రాయణమూర్తి, సీతనథరాబుధదత్తకుమారుఁ, డాదినా
రాయణమూర్తి సేవనవరాయణకిర్లమపూఁడివాసి, పా
రాయణబుద్ధిలోకమవురాయనఁ జేసెనిటుల్ కవిస్తుతిన్. 23

క. దీనినిఁ జదివిన, వ్రాసినఁ, బూనికఁ జదవించివిన్నఁ, బూజించినదే
హానూనమనోబలములఁ, బూనిసుఖముగాంతురు జనములు శుక్రదయన్. 24

### ఏతద్గ్రంథపఠనాదిఫలము

మ. ఘనముత్యాన్వయసూర్యనామకవి సత్కావ్యగ్రహస్తోత్రమే
దినమందొక్క పఠింపఁబఠించునెడ శాంతివ్రాతగాయత్రులం
గొనకన్నట్టియఘంబువోవ నెపుడుంగోర్కుల్లభింపన్నరుల్
గనిమోదింతురుసర్వభావశుభముల్ కళ్యాణదా! రాఘవా. 25

సీ. గ్రహవారములనదాగ్రహనుతిఁ జేయుచుఁ బ్రతివత్సరాంత్యవారంబునందుఁ
దత్తదహస్సులందత్తద్గ్రహంబుల స్తోత్రముల్ దానముల్ సొరిదిఁ జేసి
రాహుకేతువులస్తోత్రంబులుం దానముల్ శనివారమునఁ జేసినరసభక్తి
రవివారమున విప్రపఠకసంతర్పణంబును జేసి యాకృతిం బూజఁ జేయ

గీ. సకలవర్ణోద్భవులగుజనులు సకల, పీడలనుబాసి శుభములం బ్రీతిఁగంద్రు
నియమమక్కఱలేదు దీనికనిమున్న, గౌళికాదులువల్కఱిగాదె? రామ. 26

కం. పదియుందొమ్మిదివందల, పదిరెండవహాయనశకపువత్సరమందుం
బదునొకండవనెలలో నిరు, వదియవదినమున ముగింపఁబడెనిదిరామా. 27

నవగ్రహస్తవము సమాప్తము.



## సవరణ.

రాహుస్తవములో 11 వ పద్యమైన మత్తేభము 3, 4 పాదములీక్రింది రీతిని చేర్చి చదువుకొనవలెను.

"స్థితిఁదత్తద్గ్రహరాసులందిరిగితచ్చీలానుగుణ్యంబుగా
క్షితిసృష్టిన్నడిపించు నిజ జడమతుల్ కీర్తింతురే? రాహువా.

## శుద్ధాశుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. | పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 4 | 19 | కనుకక | కనుకఁగ | 24 | 6 | కెల్ల | తెల్ల |
| 5 | 2 | శామాత్ర | శ్యామాత్ర | ,, | 17 | మూర్ధుఁడా | మూర్ధుఁడా |
| ,, | 19 | బులభూ | బులెభూ | 37 | 8 | దత్పావ | దత్పాన |
| 14 | 18 | కవిస్వ | కలిస్వ | 38 | 16 | మద్భవ | ముదుద్భవ |

